# అథ అష్టాదశో%ధ్యాయః

# నారద జలంధర సంవాదము

సనత్కుమార ఉవాచ |

ఏవం శాసతి ధర్మేణ మహీం తస్మిన్మహాసురే | బభూవుర్దుఃఖినో దేవా భ్రాతృభావాన్మునీశ్వర || 1

దుఃఖితాస్తే సురాస్సర్వే శివం శరణమాయయుః | మనసా శంకరం దేవదేవం సర్వప్రభుం ప్రభుమ్ || 2

తుష్టువుర్వాగ్భిరిష్టాభిర్భగవంతం మహేశ్వరమ్ | నివృత్తయే స్వదుఃఖస్య సర్వదం భక్తవత్సలమ్ || 3

ఆహూయ స మహాదేవో భక్తానాం సర్వకామదః | నారదం ప్రేరయామాస దేవకార్య చికీర్షయా || 4

అథ దేవమునిర్ జ్ఞానీ శంభుభక్త స్సతాం గతిః | శివాజ్ఞయా య¸° దైత్యపురే దేవాన్ స నారదః || 5

వ్యాకులాస్తే సురాస్సర్వే వాసవాద్యా ద్రుతం మునిమ్ | ఆగచ్ఛంతం సమాలోక్య సముత్తస్థుర్ద్వి నారదమ్ || 6

దదుస్త ఆసనం నత్వా మునయే ప్రీతిపూర్వకమ్ | నారదాయ సురాశ్శక్రముఖా ఉత్కంఠితాననాః || 7

సుఖాసీనం మునివరమాసనే సుప్రణమ్య తమ్ | పునః ప్రోచుస్సురా దీనా వాసవాద్యా మునీశ్వరమ్ || 8

సనత్కుమారుడిట్లు పలికెను -

ఓ మహర్షీ! ఆ మహాసురుడు ఈ తీరున భూమిని ధర్మబద్ధముగా పాలించుచుండగా, జ్ఞాతులగుటచే దేవతలు దుఃఖితులైరి (1). దుఃఖితులై యున్న ఆ దేవతలందరు మంగళకరుడు, దేవదేవుడు, సర్వసమర్థుడు అగు శివప్రభుని మనస్సులో శరణు పొందిరి (2).

భక్తప్రియుడు, సర్వమునిచ్చు వాడునగు మహేశ్వరభగవానుని వారు తమ దుఃఖములు తొలగుట కొరకై అభీష్టములగు వచనములతో స్తుతించిరి (3). భక్తుల కోర్కెలనన్నిటినీ ఈడేర్చు ఈ మహాదేవుడు దేవకార్యమును చేయగోరి నారదుని పిలిపించి ప్రేరేపించెను (4). అపుడు దేవర్షి, జ్ఞాని, శివభక్తుడు, సత్పురుషులకు శరణ్యుడు అగు ఆ నారదుడు శివుని ఆజ్ఞచే జలంధరుని నగరములో నున్న దేవతల వద్దకు వెళ్లెను (5). దుఃఖితులై యున్న ఆ ఇంద్రాది దేవతలందరు నారదముని వచ్చుచుండుటను గాంచి వెంటనే లేచి నిలబడిరి (6). ఆదుర్దా ముఖమునందు వ్యక్తమగు చుండగా ఇంద్రాది దేవతలు నారదమహర్షికి ప్రీతిపూర్వకముగా నమస్కరించి ఆసనమునిచ్చిరి (7). దీనులగు ఇంద్రాది దేవతలు ఆసనమునందు ఉపవిష్టుడైన ఆ నారదమహర్షికి మరల నమస్కరించి ఇట్లు పలికిరి (8).

దేవా ఊచుః |

భో భో మునివర శ్రేష్ఠ దుఃఖం శృణు కృపాకర | శ్రుత్వా తన్నాశయం క్షిప్రం ప్రభుస్త్వం శంకరప్రియః || 9

జలంధరేన దైత్యేన సురా విద్రావితా భృశమ్ | స్వస్థానా ద్భర్తృ భావాచ్చ దుఃఖితా వయమాకులాః || 10

స్వస్థానాదుష్ణరశ్మిశ్చ చంద్రో నిస్సారితస్తథా | వహ్నిశ్చ ధర్మరాజశ్చ లోకపాలస్తథేతరే || 11

సుబలిష్ఠేన వై తేన సర్వే దేవాః ప్రపీడితాః | దుఃఖం ప్రాప్తా వయం చాతి శరణం త్వాం సమాగతాః || 12

సంగ్రామే స హృషీకేశం స్వవశం కృతవాన్ బలీ | జలంధరో మహాదైత్య స్సర్వామర విమర్దకః || 13

తస్య వశ్యో వరాధీనో%వాత్సీ త్తత్సదనే హరిః | సలక్ష్మ్యా సహితో విష్ణుర్యో న స్సర్వార్థ సాధకః || 14

జలంధర వినాశాయ యత్నం కురు మహామతే | త్వం నో దైవవశాత్ప్రాప్తస్సదా సర్వార్థ సాధకః || 15

దేవతలిట్లు పలికిరి -

ఓ మహర్షీ! దయానిధీ! మా కష్టమును గురించి వినుము. విని వెంటనే దానిని దూరము చేయుము. నీవు సమర్థుడవు. శంకరునకు ప్రియమైన వాడవు (9). జలంధరాసురుడు దేవతలను తమ తమ స్థానములనుండి, మరియు అధికారములనుండి పూర్ణముగా వెళ్లగొట్టినాడు. మేము మిక్కిలి ఆదుర్దాను, దుఃఖమును పొంది యున్నాము (10). సూర్యుడు, చంద్రుడు, అగ్ని యమధర్మరాజు, మరియు ఇతరలోక పాలకులు తమ స్థానములనుండి త్రోసివేయబడినారు (11). మహా బలశాలియగు ఆతడు దేవతలనందరినీ పీడించుచున్నాడు. మేము మహాదుఃఖమును పొంది యున్నాము. నిన్ను శరణు జొచ్చుచున్నాము (12). బలశాలి, దేవతలందరినీ పీచమడంచిన మహారాక్షసుడు అగు జలంధరుడు యుద్ధములో హృషీకేశుని తన వశము గావించుకొనినాడు (13). మనకు కార్యముల నన్నిటినీ సాధించిపెట్టిన విష్ణువు తాను ఇచ్చిన వరమునకు ఆధీనుడై ఆతనికి వశుడై లక్ష్మీదేవితో గూడి ఆతని ఇంటిలో నివసింప జొచ్చెను (14). ఓ మహాప్రాజ్ఞా! జలంధరుని వినాశము కొరకు ప్రయత్నమును చేయుము. నీవు మాకు దైవానుగ్రహముచే దొరికితివి. నీవు సర్వదా దేవకార్యములనన్నింటినీ చక్కబెట్టితివి (15).

సనత్కుమార ఉవాచ |

ఇత్యాకర్ణ్య వచస్తేషా మమరాణాం స నారదః | ఆశ్వాస్య ముని శార్దూలస్తానువాచ కృపాకరః || 16

సనత్కుమారుడిట్లు పలికెను -

ఆ దేవతల ఈ మాటను విని దయానిధియగు ఆ నారదమహర్షి వారిని ఓదార్చి ఇట్లు పలికెను (16).

నారద ఉవాచ ।

జానే%హం వై సురా యూయం దైత్యరాజ పరాజితాః । దుఃఖం
ప్రాప్తాః పీడితాశ్చ స్థానాన్నిస్సారితాః ఖలు ॥ 17

స్వశక్త్యా భవతాం స్వార్థం కరిష్యే నాత్ర సంశయః ।
అనుకూలో%హమివ వో దుఃఖం ప్రాప్తా యతో%మరాః ॥ 18

నారదుడిట్లు పలికెను-

ఓ దేవతలారా! రాక్షసరాజు చేతిలో ఓడి ఆతనిచే మీ స్థానములనుండి వెళ్లగొట్టబడి మీరు ఆతనిచే పీడింపబడి దుఃఖమును పొంది యున్నారను విషయమును నేను ఎరుంగుదును (17). నేను నా శక్తికి తగినట్లు మీ కార్యమును చక్కబెట్టెదను. సందేహము వలదు. ఓ దేవతలారా! మీరు దుఃఖమును పొంది యున్నారు గనుక, నేను మీకు అనుకూలుడనే (18).

సనత్కుమార ఉవాచ ।

ఏవముక్త్వా మునిశ్రేష్ఠో ద్రష్టుం దానవవల్లభమ్ । ఆశ్వాస్య సకలాన్
దేవాన్ జలంధరసభాం య¸° ॥ 19

అథాగతం మునిశ్రేష్ఠం దృష్ట్వా దేవో జలంధరః । ఉత్థాయ పరయా
భక్త్యా దదౌ శ్రేష్ఠాసనం వరమ్ ॥ 20

స తం సంపూజ్య విధివద్దానవేంద్రో%తి విస్మితః । సుప్రహస్య తదా
వాక్యం జగాద మునిసత్తమమ్ ॥ 21

సనత్కుమారుడిట్లు పలికెను-

ఆ మహర్షి ఇట్లు పలికి దేవతలందరినీ ఓదార్చి రాక్షసరాజగు జలంధరుని చూచుటకై అతని సభకు వెళ్ళెను (19). అపుడు జలంధర మహారాజు అచటకు విచ్చేసిన మహర్షిని గాంచి

పరమభక్తితో లేచి నిలబడి శ్రేష్ఠమగు ఆసనమును ఇచ్చెను (20). ఆ రాక్షసరాజు మిక్కిలి ఆశ్చర్యమును పొంది, ఆ మహర్షిని యథావిధిగా పూజించి చిరునవ్వుతో నిట్లనెను (21).

జలంధర ఉవాచ|

కుత ఆగమ్యతే బ్రహ్మన్ కిం చ దృష్టం త్వయా క్వచిత్ |
యదర్థమిహ ఆయాత స్తదాజ్ఞాపయ మాం మునే || 22

జలంధరుడిట్లు పలికెను -

ఓ మహర్షీ! ఎచటనుండి వచ్చుచున్నారు? మీరు ఎచట ఏమి చూసినారు? ఇచటకు వచ్చిన పని యేమి? ఓ మునీ! ఆ పనిని నాకు ఆజ్ఞాపించుడు (22).

సనత్కుమార ఉవాచ |

ఇత్యాకర్ణ్య వచస్తస్య దైత్యేంద్రస్య మహామునిః | ప్రత్యువాచ ప్రసన్నాత్మా నారదో హి జలంధరమ్ || 23

సనత్కుమార ఉవాచ |

రాక్షసరాజగు జలంధరుని ఈ మాటను విని నారదమహర్షి ప్రసన్నమగు మనస్సు గలవాడై ఆతనికిట్లు బదులు చెప్పెను (23).

నారద ఉవాచ |

సర్వదానవ దైత్యేంద్ర జలంధర మహామతే | ధన్యస్త్వం సర్వలోకేశ రత్న భోక్తా త్వమేవ హి || 24

మదాగమన హేతుం వై శృణు దైత్యేంద్రసత్తమ | యదర్థమిహ చాయాతస్త్వహం వక్ష్యే%ఖిలం హి తత్ || 25

గతః కైలాసశిఖరం దైత్యేంద్రాహం యదృచ్ఛయా | యోజనాయుత విస్తీర్ణం కల్పద్రుమమహావనమ్ || 26

కామధేనుశతాకీర్ణం చింతామణి సుదీపితమ్ | సర్వరుక్మమయం దివ్యం సర్వత్రాద్భుతశోభితమ్ || 27

తత్రోమయా సహాసీనం దృష్టవానస్మి శంకరమ్ | సర్వాంగ సుందరం గౌరం త్రినేత్రం చంద్రశేఖరమ్ || 28

తం దృష్ట్వా మహదాశ్చర్యం వితర్కో మే% భవత్తదా | క్వాపీదృశీ భ##వేద్వృద్ధి సై#్త్రలోక్యే వా న వేతి చ || 29

తావత్త వాపి దైత్యేంద్ర సమృద్ధి స్సంస్మృతా మయా | తద్విలోకనకామో%హం త్వత్సాన్నిధ్య మిహాగతః || 30

నారదుడిట్లు పలికెను-

రాక్షసులందరికీ ప్రభువైన జలంధరా! నీవు గొప్ప బుద్ధిమంతుడవు. నీవు ధన్యుడవు. ఓ సర్వలోక ప్రభూ! శ్రేష్ఠవస్తువు (రత్నము) లను అనుభవించు వాడవు నీవే (24). ఓ రాక్షస శ్రేష్ఠా! నేను వచ్చిన కారణమును వివరముగా చెప్పెదను. వినుము (25). ఓ రాక్షసరాజా! నేను అనుకోకుండగా కైలాసమునకు వెళ్లితిని. ఆ కైలాసశిఖరము పదివేల యోజనముల విస్తీర్ణము గలది. అచట కల్పవృక్షములనేకము గలవు (26). చింతామణుల ప్రకాశముతో నలరారు కైలాసమునందు వందలాది కామధేనువులు గలవు. దివ్యమగు కైలాసశిఖరము పూర్తిగా స్వర్ణమయము. అచట అంతటా అద్భుతములు శోభను గూర్చును (27). అచట సర్వావయవసుందరుడు, పచ్చనివాడు, ముక్కంటి, చంద్రుని శిరముపై దాల్చినవాడు అగు శంకరుడు పార్వతితో గూడి ఉపవిష్టుడై యుండగా చూచితిని (28). ఆ గొప్ప అద్భుతదృశ్యమును చూచిన నాకు అప్పుడు మనస్సులో ఒక సందేహము కలిగెను. ఇట్టి సంపద ముల్లోకములో ఎక్కడనైననూ ఉన్నదా? లేదా? (29) ఓ రాక్షసరాజా! అంతలో నాకు నీ సంపద గుర్తుకు వచ్చినది. అందువలననే, నీ సంపదను చూచుటకై ఇచటకు నీ సన్నిధికి వచ్చియుంటిని (30).

సనత్కుమార ఉవాచ |

ఇతి నారదతచ్ఛ్రుత్వా స దైత్యేంద్రో జలంధరః | స్వసమృద్ధిం సమగ్రాం వై దర్శయామాస సాదరమ్ || 31

దృష్ట్వా స నారదో జ్ఞానీ దేవకార్య సుసాధకః | ప్రభుప్రేరణయా ప్రాహ దైత్యేంద్రం తం జలంధరమ్ || 32

సనత్కుమారుడిట్లు పలికెను-

నారదుని ఈ మాటను విని రాక్షసరాజగు ఆ జలంధరుడు ఆదరముతో తన పూర్ణసంపదను చూపించెను (31). జ్ఞాని, దేవతల కార్యమును చక్కబెట్టువాడు అగు ఆ నారదుడు ఆ సంపదను చూచి శంకరుని ప్రేరణను పొంది, రాక్షసరాజగు ఆ జలంధరునితో నిట్లనెను (32).

నారద ఉవాచ |

తవాస్తి సుసమృద్ధిర్హి వరవీర కిలాధునా | త్రైలోక్యస్య పతిస్త్వం హి చిత్రం కిం చాత్ర సంభవమ్ || 33

మణయో రత్నపుంజాశ్చ గజాద్యాశ్చ సమృద్ధయః | తే గృహేఽద్య విభాంతీహ యాని రత్నాని తాన్యపి || 34

గజరత్నం త్వయానీతం శక్రస్యైరావతస్తథా | అశ్వరత్నం మహావీర సూర్యస్యోచ్చైశ్శ్రవా హయః || 35

కల్పవృక్షస్త్వయానీతో నిధయో ధనదస్య చ | హంసయుక్త విమానం చ త్వయానీతం హి వేధసః || 36

ఇత్యేవం వరరత్నాని దివి పృథ్వ్యాం రసాతలే | యాని దైత్యేంద్ర తే భాంతి గృహే తాని సమస్త తః || 37

త్వత్సమృద్ధిమిమాం పశ్యన్ సంపూర్ణాం వివిధామహమ్ | ప్రసన్నోఽస్మి మహావీర గజాశ్వాది సుశోభితామ్ || 38

జాయారత్నం మహాశ్రేష్ఠం జలంధర న తే గృహే | తదానేతుం విశేషేణ స్త్రీరత్నం వై త్వమర్హసి || 39

యస్య గేహే సురత్నాని సర్వాణి హి జలంధర | జాయారత్నం న చేత్తాని న శోభ##న్తే వృథా ధ్రువమ్ || 40

నారదుడిట్లు పలికెను-

ఓ గొప్ప వీరుడా! నీకు గొప్ప సంపద గలదు. నీవు ముల్లోకములకు ప్రభుడవు. దీనిలో ఆశ్చర్యమేమున్నది? (33). మణులు, రత్నములు నీవద్ధ గుట్టలుగా గలవు. గజాది సమృద్ధులు కూడ నీకు గలవు. మరియు శ్రేష్ఠవస్తువులన్నియు ఈనాడు నీ ఇంటిలో విరాజిల్లుచున్నవి (34). గజశ్రేష్ఠమగు ఐరావతమును నీవు ఇంద్రునివద్ధనుండి తెచ్చుకొంటివి. ఓ మహావీరా! అశ్వశ్రేష్ఠమగు ఉచ్చైశ్శ్రవమను అశ్వమును సూర్యుని వద్ధనుండి లాగు కొంటివి (35). నీవు కల్పవృక్షమును, కుబేరుని నిధులను, మరియు బ్రహ్మగారి హంసలను పూన్చిన విమానమును తెచ్చుకొంటివి (36). ఓ రాక్షసరాజా! ఈ విధముగా, స్వర్గము నందు భూమియందు పాతాళమునందు ఏయే శ్రేష్ఠవస్తువులు గలవో, అవి అన్నియూ నీ ఇంటిలో ప్రకాశించుచున్నవి (37). ఓ మహావీరా! గజములు, అశ్వములు మొదలగు వాటితో మిక్కిలి ప్రకాశించునది, వివిధమైనది, సంపూర్ణమైనది అగు నీ ఈ సమృద్ధిని గాంచి నేను ప్రసన్నుడనైతిని (38). ఓ జలంధరా! నీ గృహములో శ్రేష్ఠమగు భార్యారత్నము లేకున్నది. కావున నీవు విశేషించి స్త్రీ రత్నమును దోడ్కొని రావలెను (39). ఓ జలంధరా!గృహములో శ్రేష్ఠవస్తువులు అన్నీ ఉన్ననూ, భార్యారత్నము లేనిచో, అవి శోభిల్లవు. అవి వ్యర్థమగును. ఇది నిశ్చయము (40).

సనత్కుమార ఉవాచ |

ఇత్యేవం వచనం శ్రుత్వా నారదస్య మహాత్మనః | ఉవాచ దైత్యరాజో హి మదనాకులమానసః || 41

సనత్కుమారుడిట్లు పలికెను-

మహాత్ముడగు నారదుని ఈ మాటలను విని ఆ రాక్షసరాజు మన్మథుని చే కల్లోల పరచబడిన మనస్సు గలవాడై ఇట్లు పలికెను (41).

జలంధర ఉవాచ|

భోభో నారద దేవర్షే నమస్తే%స్తు మహా ప్రభో | జాయారత్న వరం కుత్ర వర్తతే తద్వదాధునా || 42

బ్రహ్మాండే యత్ర కుత్రాపి తద్రత్నం యది వర్తతే | తదానేష్యే తతో బ్రహ్మన్ సత్యం సత్యం న సంశయః || 43

జలంధరుడిట్లు పలికెను-

ఓయీ నారదా! దేవర్షీ! మహాప్రభూ! నీకు నమస్కారము అగు గాక! అట్టి భార్యారత్నము ఎచ్చట గలదో ఇప్పుడు నాకు చెప్పుము (42). ఓ బ్రాహ్మణా! అట్టి స్త్రీ రత్నము బ్రహ్మాండములో ఎచ్చట నున్ననూ నేను దోడ్కొని రాగలను. ఇది ముమ్మాటికీ సత్యము. సందేహము లేదు (43).

నారద ఉవాచ |

కైలాసే హ్యతిరమ్యే చ వర్వర్ధి సుసమాకులే |
యోగిరూపధరశ్శంభురస్తి తత్ర దిగంబరః || 44

తస్య భార్యా సురమ్యా హి సర్వలక్షణలక్షితా | సర్వాంగసుందరీ నామ్నా పార్వతీతి మనోహరా || 45

తదీదృశం రూపమనన్య సంగతం దృష్టం న కుత్రాపి కుతాహలాఢ్యమ్ |

అత్యద్భుతం మోహనకృత్సు యోగినాం సుదర్శనీయం పరమర్ధి కారి || 46

స్వచిత్తే కల్పయామ్యద్య శివాదన్యస్సమృద్ధిమాన్ | జాయారత్నాన్వితా ద్వీర త్రిలోక్యా న జలంధర || 47

యస్యా లావణ్యజలధౌ నిమగ్నశ్చతురాననః | స్వధైర్యం ముముచే పూర్వం తయా కాన్యోప మీయతే || 48

గతరాగో%పి హి యయా మదనారిస్స్వ లీలయా | నిజతంత్రో%పి యతస్స స్వాత్మ వశగః కృతః || 49

యథా(స్త్రీ రత్న సంభోక్తు స్సమృద్ధి స్తస్య సాభవత్ | తథా న తవ దైత్యేంద్ర సర్వరత్నాధిపస్య చ || 50

నారదుడిట్లు పలికెను-

మిక్కిలి సుందరమైనది, శ్రేష్ఠ సంపదలతో నిండియున్నది అగు కైలాసములో దిగంబరుడగు శంభుడు యోగిరూపమును ధరించి యున్నాడు (44). ఆతని భార్య పేరు పార్వతి. ఆమె సర్వావయవ సుందరి; మిక్కిలి రమ్యమైనది; మంచి లక్షణములన్నింటితో గూడి మనస్సునకు ఆహ్లాదమును కలిగించునది (45). మిక్కిలి కుతూహలమును రేకెత్తించే ఆమె రూపము వంటి రూపము మరెక్కడనూ కానరాదు. అత్యద్భుతమగు ఆమె రూపము గొప్ప యోగులకైననూ మోహమును కలిగించును. గొప్ప సంపదలనిచ్చే ఆమె రూపము చూడ ముచ్చటను గొల్పును (46). ఓ వీరా! జలంధరా! గొప్ప భార్యతో గూడియున్న శివునికంటే గొప్ప సమృద్ధి గలవాడు ముల్లోకములలో మరియొకడు లేడని ఇప్పుడు నా మనస్సులో తోచుచున్నది (47). ఏ యువతి యొక్క సౌందర్య సముద్రములో మునిగిన బ్రహ్మగారు పూర్వము తన ధైర్యమును గోల్పోయి నాడో, అట్టి ఆమెతో ఇంకొకరిని పోల్చుట ఎట్లు సంభవము? (48). రాగద్వేషములకు అతీతుడు, మన్మథ శత్రువు, స్వతంత్రుడు అగు శివుని కూడ ఆమె తన లీలచే తన వశము చేసుకొనెను (49). అట్టి స్త్రీరత్నమును వివాహమాడిన వానికి ఏ సమృద్ధి గలదో, అట్టి సమృద్ధి, ఓ రాక్షసరాజా! సర్వశ్రేష్ఠ వస్తువులకు నీవు ప్రభువే అయిననూ, నీ వద్దలేదు (50).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్త్వా స తు దేవర్షిర్నారదో లోక విశ్రుతః | య¸ం విహాయసా దేవోపకారకరణోద్యతః || 51

శ్రీ శివమహాపురాణములో రుద్ర సంహితయందు యుద్ధఖండే దేవర్షి జలంధర సంవాదో నామ అష్టాదశోధ్యాయః

సనత్కుమారుడిట్లు పలికెను-

దేవర్షి, లోకములో ప్రఖ్యాతిని గాంచిన వాడు, దేవతలకు ఉపకారమును చేయుటకై సర్వదా సంసిద్ధముగ నుండు వాడు అగు ఆ నారదుడు ఇట్లు పలికి ఆకాశమార్గమున నిర్గమించెను (51).

శ్రీ శివమహాపురాణములో రుద్ర సంహితయందు యుద్ధఖండలో నారద జలంధర సంవాదమనే పదునెనిమిదవ అధ్యాయము ముగిసినది (18).